ఓపినంతవటు లి ట్లీ సార్వస్వత మహోద్యమమును హృదయపూర్వకముగ నాహ్వానించుచు, నెప్పటి కప్పుడు వినూత్న రచనా వ్యవసాయధురీణ లగుచున్న కవయిత్రు లెందఱో అందఱును మనకు వంద్యమానలే యగుచున్నారు. ఇట్టివారు సరస్వతీసేవానురక్తలుగనే కాక, దేశమాతృ కళ్యాణరేఖాలంకారకారిణులుగ కూడ పొగడొంద గల్గుచున్నారు.

పరమపిత యగు నేకేశు డెప్పుడును దనివోని కళాసంపదతో నీ యమృత వ్యవసాయికురాంౘ్ర నాచంద్రార్క మాశీర్వదించును గాత!

మహిళా సారస్వత మనల్పమై, మహీయస గౌరవాస్పదమై యాశాశ్వతము వర్ధిల్లును గాత!

"సహనావతు సహనౌభునక్తు సహవీర్యం కరవామహై-
తేజస్వినావధీత మస్తు మావిద్విషామహై."

— :o: —

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ముద్రణ : శివాజీ ప్రెస్ సికింద్రాబాద్.